

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి సొంత కధలు

# 28-12- 24 to 24-01-25

**15.**అది మరీ పెద్దఖర్చు కాదు **24-01-25**

మా ఆవిడ ఎదో ఫోను కాల్ మాట్లాడి " పదండి మా అక్క వాళ్ళింటికి పోయి వద్దాము " అన్నది . అంటూనే తయారైపోయింది . ఇంత క్విక్ అంటే ఏంటో కొంప మునిగిందా ?అని నేను అదిరి చచ్చాను .

అక్క ఎదురువచ్చి - చెల్లిని సాదరంగా లోనికి తీసుకుపోయింది . నేను వాళ్ళిద్దరి హావ భావాలను గమనిస్తూ వినోదించటానికి వీలున్న చోట - దొరికిన కుర్చీలో కూచున్నాను . అప్పా చెల్లెనులు ఇద్దారూ ఒకరి మొఖాలు ఒకరి ఒకరు ఆప్యాయంగా పరికించుకొని ఒకరి తల జుట్టును ఒకరు నిమిరుకున్నారు , "కొత్తి మీరా కట్టను - ఎండు గోంగూర కట్ట పలకరించినట్లు ఉందని నేను నవ్వునుకున్నాను . అప్పటికి ఎంతో కొంత సమయం తరువాత అక్క చెలేండ్లు ఇద్దారూ జుట్లు విడిపించుకొని కిచెన్లోకి వెళ్లి నాకు కాఫీ తయారు చేశారు .

మా ఆవిడ ఎంతో సంబరం కన పరుస్తూ " ఏమండీ అక్క జుట్టు కొంచెము ఒత్తుగా ను కొంచెము పొడుగునూ పెరిగింది కాదూ ?" అని అడిగింది . నేను జంకుతూ జంకుతూ " వదినగారంటే తల్లి లాంటి ది అన్న దృష్టితో చూడవలె అని మర్చి పోయావా? "అని అడిగాను .

ఆవిడ కంగుతిని - పళ్ళు బిగపట్టుకొని " పోనీ నా జుట్టు ఎలాఉండే ?అది చెప్పండి ? " అన్నది .
"నీ తల కట్టు అమోఘము . ఏపుగా ఎదిగిన కొత్తిమీర కట్టనే అనుకో " అని నేను నోరు పారేసాను .
" అలాగే అనుకోండి . కానీ ఇలాంటి దానితో తిరగాలంటే మీకు సిగ్గుగా లేదూ ?" అని ఆమె నన్ను నిల దీసింది .
" వున్నది కానీ అది కాదనటం ఎట్లాగో ఆలోచన కాకుండా వుంది "
" మీకు నా జుట్టు గురించి ఎడతెగని ఆలోచనలు వుండే ఉంటావని - కానీ ఏమీ చేయాలో మీకు పాలు పోకుండా వుండే నని - అక్క అన్నది . పెరిగిన తన జుట్టు

సాక్షిగా మనకో ఉపాయం కూడా చెప్పింది . రేపు ఎలాగో ఆదివారము కాబట్టి మనము "నాగప్పా దిప్ప " అనే పునీక్షేత్రం వెళ్ళుదాము . మీ కొరికి తీరి నాకు నాగు పాము అంత జుట్టు వస్తుంది "
"అది ఇక్కడికి 300 కిలోమీ వుంది. అక్కడికెడితే నీకు జుట్టు ఎలా పెరుగుతుంది ? ముందు ఈ సందేహం తీర్చు . అప్పుడు ఆలోచిద్దాము"
"నాగప్పా దిప్ప "లో ఓ నాగుపాము పుట్టమీద ఓ వందేళ్ల నాటి కొబ్బరి చెట్టు వున్నదిట .దాని తల నాగు పడగలా ఉంటుందిట . ఆ నాగ కొబ్బరి చెట్టు రాల్చిన బోండాలను వెయ్యి నూట పదహారులకు ఒకటి అమ్ముతూ వున్నా కానీ కొనే వారి క్యూలైను కి అంతే లేదుట .ఎంత క్యూ ఉంటే అక్కడ అంత మహిమ వున్నది అనే కదా ? అర్ధము ? ఆకాయను కొని ఆ నాగుల పుట్టకు కోట్టి - కొట్టిన అరగంటలోనే ఆ కొబ్బరిని రుబ్బించి - కొబ్బరి పాలు తయారు చేయించుకొని - ఆ పాలను అక్కడే వున్నా నలుగురు ముత్తైదువులకు - ఆరుగురు కన్నె పిల్లల తలలకి రాసి - ఆ చేతులతో మన తలను తడుపుకుంటే జుట్టు నల్లగా ఒత్తుగా పొడుగ్గా పెరుగుతుంది టండీ - మా అక్క తాను పోయొచ్చి - తన జుట్టు పెరిగింది అని నాకు నమ్మకం కుదిర్చి నాక నాకు చెప్పింది . మనం కూడా నమ్మకంతో వెడదామండీ " అని ఆమె అన్నది .
నిన్న అర్ధరాత్రి వరకూ మా ఇద్దరిమధ్యా ఇదే సంభాషణ జరిగి - ఆడ వారి జుట్టు పోషణ ముందు ఎంత ఖర్చు అయినా అది వృధా కిందకు రాదు అని నాకు నమ్మకం కుదిరే దాకా ఆమె వాదించటం వల్ల - మాకారు కోసం ఒక డ్రైవర్ ను ఏర్పాటు చేసుకొని "నాగప్పా దిప్ప "కు బయలు దేరాము . అతడు వచ్చి " మా ఆడది కూడా జుట్టు కోసం అని "నాగప్పా దిప్ప " వేడుదాము అని ఎప్పటినుండో అనుకుంటున్నదిట . దారిలో ఆమెను కూడా పిక్కుప్ చేనుకు వెడదాము . ఆమె మేడం గారికి తోడుగా ఉంటది . నేను డ్రైవర్ బేటా లేకుండా కారు తొలుతా" అన్నాడు .

సరే అలాగే వెళ్ళాము .మొదట "నాగప్పా దిప్ప "లో నాగుల పుట్ట మీద వున్నా కొబ్బరి చెట్టుకు కాసిన కొబ్బరి కాయను 1116 కు కొన్నాము . ఈ దిప్పగురించి ఏమిటంటేఈ దిప్ప మీదఎప్పుడైనా సరే 330 మందికంటే ఎక్కువ నుంచుంటే ఆ భారానికి ఆ దిప్ప పాతాళంలోకి కుంగి పోతూ వుంటుందట . అందువల్ల లోపలికెళ్ళి

బయటకి వచ్చిన వారిని లెక్కా చూసి అందుకు తగ్గట్లు ఎంట్రీ టికెట్స్ ఇస్తారు . మూడు గంటల అనంతరం మాకు ఎంట్రీ దొరిగింది .

మేము కొట్టిన కొబ్బరి కాయను ముక్కలు తీసి - పొత్రాన్ని శుభ్రంగా కడిగి - మా ముక్కలను రోట్లో వేసి పాల లాగా మర్చి ఇచ్చిన స్త్రీ తనకి 200 అంటే ఇచ్చాము . ఆ పాలు ముత్తైదువల జుట్టుకు పూయటానికి ముందు నాగుల పుట్ట పూజారి గారి అట్టలు కట్టిన జుట్టుకు పూయాలి అన్నారు . ఇందునకు ఆయనకు 516 ఇచ్చాము . 4 ముత్తైదువులు - 6 మంది కన్నె పిల్లలు ఒక్కో గ్రూప్ గా అక్కడి చెట్ల కింద పీటలు వేసుకొని కూర్చొని వున్నారు . ఆ కన్నె పిల్లల జుట్లు చూస్తే గుండెల్లో గంటలు మోగాయి . వీరి అందరికీ కలిపి 1116 అన్నారు . అవీ ఇచ్చాము . అన్నీ చేసి ఇంటికి వచ్చి చేరాము .
"నా జుట్టు ఆ కన్నె పిల్లల జుట్టు లా నల్లగా లావుగా ఒత్తుగా పెరిగి - మీ గుడిలో గంటలు మోగితే - దాని ముందు ఇది ఏ పాటి ఖర్చు అవుతుందో చెప్పండి ? అని న భార్య నన్ను ఊకో పెట్టింది . వాళ్ళ జుట్లు నిజం కాదేమో ? - వారిలాగా నీవు కూడా విగ్గులే వాడు" అని నేను అన్నాను .

ఈ కథలోని నీతి ఏమిటి అంటే " ఆడవారి జుట్టు పోషణముందు ఏ ఖర్చూ పెద్ద ఖర్చు కాదు . "జుట్టు పెరగటం , పెరగకపోవడం దాని సొంత ఇష్టానికి లోబడి " అనే కండిషన్ వర్తిస్తుంది .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి స్వంత కథ

**14.**వాళ్ళట్లా అంటే మేమెట్లా చేయాలో ? 22-01-25

నేను వారింటికి వెళ్ళాను . ఆయనకు యాభయ్ ఆమెకు నలభై ఉండవచ్చు .
"అయన నాకు యాబయి ప్లస్ అని ఒప్పుకుంటే నాకు నభయ్ ప్లస్ అని ఒప్పుకుంటానండి" అని ఆమె అంటూ ఉంటుంది .
నేను వెళ్లేసరికి వారిద్దరూ పక్క పక్కాగా - తమ మేడ మెట్ల లోని మూడో మెట్టు మీద కూచుని వున్నారు . అదే కూచున్న రీతిలో వారు వెనక్కు జరుగుతూ మేడ పైకి వెడుతూ వున్నారు . అంటే కప్ప నేల మీద కూచుని వెనక్కి గెంతినట్లు,

వాళ్ళు కిందమెట్టు పై కూచుండి అక్కడి నుండి వెనకవున్న పై మెట్టు మీదకు కూచుంటూ  - మెట్లు ఎక్కుతూ మేడపైకి వెడుతూ వున్నారు .

" ఇదేమి విధానము ?" అని నేను అడిగాను .
" మీకు   గుండె జబ్బు వచ్చే అవకాశాలు వున్నాయి . అందువలన ఒక ఎక్సెర్సయిజు గా మేడ మెట్లు ఎక్కి దిగుతూ వుండండి " అని గుండె డాక్టర్ గారు సలహా చెప్పాడు ." మీకు ఇప్పుడిప్పుడే మోకాళ్ళ గుజ్జు కరుగుతూ  వున్నది . అందువల్ల మెట్లు ఎక్కవద్దు " అని మోకాళ్ళ డాక్టర్ గారు చెప్పాడు . "మీకు మోకాళ్ళు ముఖ్యమా గుండె ముఖ్యమా ? అనేది మీ ఛాయస్- మాదేమీ లేదు " అని వాళ్ళు ఇద్దారూ అన్నారు . "వాళ్ళట్లా అంటే  మేమెట్లా చేయాలో తెలియక ఇట్లా చేస్తున్నాము  " అని వారు అన్నారు

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి యొక్క సొంత కథ

**13.**గేట్ మూసివేయబడ్డ మామ్మ ఇల్లు   21-01-25

ఈ కథ ఫేస్ బుక్ లో **200** వరకూ లైకులు యాభై అరపై కామెంట్లు పొందింది .గొప్ప కామెంట్లు అనుకున్నవి కొన్ని

1. E roju kuda oka manchi kadha chadivaanu...chalaa artistic ga cheppaaru ....what is Art of Living ani. By ANURADHA https://www.facebook.com/groups/1623989977901118/user/100011428654941/
2. డొక్కా సీతమ్మ గారిని గుర్తు చేసారు థాంక్స్ సార్  - BHARATI RAMBABU https://www.facebook.com/groups/260211464103315/user/100007374737808/
3. Very nice way of explaining the concept of The Art Of Living thank you   - VIJayalakshmi hasti

https://www.facebook.com/groups/260211464103315/user/100015455357387/

4.నేటికి పెద్దమ్మలు కొందరు సజీవంగా ఉన్నారు.
కాని పెద్దమ్మల గురించి ఇంతగా
జ్ఞాపకం ఉంచుకునే రోజులా ఇవి. నాటి ఆప్యాయతలు తీపి
జ్ఞాపకాలుగా ...నేటి తీరు మారిన వారు మూతి దులిపి
మరచిపోయే విజ్ఞులు.
(కొందరు
అమాయకులు క్షమించ ప్రార్ధన )
ఏది యేమైనా పెద్దమ్మ జ్ఞాపకంతో
హృదయం చెమర్చింది. చెమ్మగిల్లిన కనులతో ధన్యవాదాలు తెలుపుతూ👏🏻👏🏻👏🏻
👏🏻👏🏻👏🏻👏🏻👏🏻👏🏻
మరో పెద్దమ్మ.

శుభాశీస్సులు నాయనా! వాస్తవికతను జోడించి మీ కలం నుండి జాలు వారిన
అక్షరాలను పాఠకుల అశ్రువులు గా మార్చారు.
చక్కని భావుకత
బహు చక్కని విశ్లేషణ తో కూడిన ఈ గొప్ప
కధనం హృదయాన్ని స్పందింప చేసింది.

**Namboori JhansiRani**

https://www.facebook.com/groups/2897865043575522/user/100009603080217/

నేడు **21 -01 -25** **-** మంగళవారం నా అర్ధాంగి కి ఇష్టమైన వారము **.** నాకు ఆమె యొక్క సంస్మరణ దినము **.**

మొన్న మా ఇంటికి ఓ చిన్న పిల్లవాడు నాలుగేండ్ల వాడు వచ్చాడు . నేను మా గేటుకు తాళం పెట్టి వుంచుతాను . నేను వంటరిగా ఉంటున్న ఇంటిలోపలికి ఎవరన్నా వస్తారేమో ? అన్నసంశయం తో . అట్లాగే నేను మా గేటుకు తాళం

తీయటానికి కూడా బద్దకం చేస్తాను . ఆ తీస్తే మటుకు వచ్చే వారు ఎవరున్నారులే అనే నిరాశతో .

ఆపిల్ల వాడు గేట్ పట్టుకుని ఒకటే ఊపాడు, గేట్ విరిగి పోతే బాగుండు అన్నట్లు . అతడు అట్లా ఎందుకు అనుకున్నాడు అంటే ? ఆమె వున్నపుడు చిన్న పిల్లల కోసము అని కొన్ని చాకెలెట్లు తనవద్ద ఉంచుకొని దెగ్గరికి వచ్చిన ప్రతి పిల్ల వాడి చేతిలోనూ- ఎన్ని సార్లు వస్తే అన్ని సార్లూఒకటి పెట్టేది . దీని గురించి ఆమె చెప్పేది ఏమిటంటే " నా చిన్నపుడు మేము బడికి వెళ్లే రోజులలో - ధనుర్మాసం లో - ఓ పెద్దమ్మ గారు- తన ఇంటిలో దేమునికి బాల భోగం చేసి మాకు ఆ ప్రసాదాలు పెట్టేది . మాకు ధనుర్మాసము ఐ పోయిందని తెలియక ఎన్నో రోజుల పాటు అట్లాగే వెడుతూ వుండే వారము . ఆమెకూడా లేదు అనకుండా ఏదో ఒకటి చేతిలో పెడుతూ ఉండేది " అని .

దీని గురించి విని నేను " దీనినే ది ఆర్ట్ అఫ్ లివింగ్ అంటారు "అనుకుంటూ వుండే వాడిని. ఎందుకంటే ఆమె ఎవరో నాకు తెలీదు . కానీ ఒక మంచి మనస్సుగల మనిషి ఎట్లావుంటుందో ఊహించి ఒక రూపం తయారు చేసుకున్నాను .ఆమె ఒకరిని సంతోష పెట్టటం కోసం కొంత జీవితాన్ని వాడుకుంది . ఆమె చేతిమీదగా ఏదో ఒకటి తిని అదో మధుర స్మృతిగా మనస్సులో దాచుకున్న పిల్లలు ఫదుల మంది వుంటారు . ఈ పిల్లలు ఆమె మరణాంతరం కూడా తమ మధుర స్మృతులలలో భాగంగా - ఆమె రూపాన్ని కూడా గుర్తు చేసుకుంటూ వుంటారు . మొదటి పెద్దమ్మ గారు అరవై ఏళ్ళు బ్రతికి మరణించింది అనుకుందాము . ఆమె ను ఒక మంచి మనిషిగా ఆమెను గుర్తు చేసుకునే పిల్లల తరము మరొక అరవై యేండ్లు బ్రతికాబు అనుకుందాము . ఇప్పుడు ఏ దేహము లేని పెద్దమ్మ గారు మనుషుల యొక్క ఊహల లో మరొక అరవై యేండ్లు బ్రతికినట్లు .
పెద్దమ్మగారి నుండి నేరుగా ఆనందాన్ని పొందిన వారు - పెద్దమ్మ గారితో తమ అనుభూతులను నెమరు వేసుకుంటూ ఇతరులతో ముచ్చటించినపుడు విన్నచిన్న వారు కూడా వున్నారు కదా ? వీరు కూడా మరొక అరవై యేండ్లు బ్రతికా రనుకుందాము . వారు కూడా " అట్లా ప్రసాదాలు పెట్టె పెద్దమ్మ గారు వుండెదిట " అని అది ఒక జ్ఞ్యాపకంగా చెప్పుకుంటారు . ఇప్పుడు పెద్దమ్మ గారు

తన మరణాంతరం మొత్తం నూట ఇరపై యేండ్లుబ్రతికి వున్నట్లయింది . ఇదే ది ఆర్ట్ అఫ్ లివింగ్ . ఇహ మన పురాణాలు , ఇతిహాసాల ద్వారా మనము తరతరాల పాటు చెప్పుకో దగ్గ మంచిని - మంచి విషయాలను కల్పించిన వారే చిరంజీవులు .

పిల్లవాడు గేట్ ను పట్టుకుని ఊపుతూ " ఆమె లేదు" అనుకోవటానికి బదులు - ఆమె బయటికి రావటానికి లేదా లోపలి కి వెళ్లి ఆమెను చూడటానికి ఈ గేట్ అడ్డు పడుతూ వున్నదని అనుకుంటూ ఉన్నట్లు వుంది .ఒకమనిషి లేదు అనుకోవటానికి వీలు లేకుండా ఆమె మంచితనమే ఆ పిల్లవాడిలో అనేక భావనలకు ఊపిరి పోస్తున్నది అనుకోవాలి . ఈ రకంగా ఆమె అమరురాలు . అతడు పెద్దైనాక " నాకు ఎప్పుడూ చాకోలెట్లు ఇచ్చే మమ్మ గారు ఉండేది . వున్నట్లుండి ఆమె ఇంటి గేట్స్ మూసి వేశారు .ఆమె నా కోసం అని బయటకు వస్తుందేమో నని గేట్లు పట్టు కొని ఊపే వాడిని . గేట్లు మూసి వేయటమే అంటే ఆ ఇంటి మనిషి చని పోయినట్లు అనుకోవాలని నాకు తెలీని రోజులవి . అలంటి మంచి మనిషి ఇప్పుడు లేదు " అంటూ ఈ పిల్లవాడు కూడా తన అరపై డెబ్బై ఏండ్ల ప్రాయంలో గేట్ మూసివేయబడ్డ మామ్మ ఇంటిని గురించి గుర్తు చేసుకుంటాడు కాబోసు . ఆమె ది ఆర్ట్ అఫ్ లివింగ్ ని సాధించింది . ఇది ఇంత సులువు అని తెలియని శుంఠలు ఎదో భోదిస్తూ వున్నారు .

ఇది ఎదో మీకు అర్ధం అయ్యేట్లు రాసానా? అని నాకు సందేహం వచ్చింది .అప్పుడు ఇలా జరిగింది .అది దైవ సంకల్పము వల్లే జరిగింది అనుకుంటాను . ఇంటి వద్ద " కోటేశ్వరమ్మ " అనే మంచి ఇల్లాలు వున్నది . ఆమె ఏవో కారణాల వల్ల నిన్నటి సంక్రాంతి నాడు అరిసెలు వండుకో లేదుట . అందుకని ఇప్పుడు అవి వండి , కొన్ని తీసుకొని వచ్చి నా చేతిలో పెట్టింది . నేను ఒంటరిగా ఉంటున్నాను -- తింటున్నానో? లేనో?? అనే సోదరీ వాత్సల్యం తో పెట్టింది . " నాకు పెట్టె వారు ఎవరున్నారు ? అంటూ నేను ఆమెఇచ్చిన పొట్లం చేతికి అందుకొని రొండు అరిసెలు పరపరా తినేసాను . ఈ సంగతి నా పిల్లలు తెలుసుకుంటారు . ఈమె ఎవరో ఆమె రూపము ఏమిటో వారికి వారి పిల్లలకీ కూడా తెలుసు . ఈ సోదరి కోటేశ్వరి పరిపూర్ణ ఆయుర్దాయము అనుభవించి అటు పిమ్మట కూడా - నా పిల్లల హృదయాలలోనూ - మనుమరాలు మనుమల హృదయాలలోనూ చిరంజీవిగా ఉంటుంది .అంటే ఈ కోటేశ్వరమ్మ తన సహజ

ఆయువును కాకా మరెంతో అదనపు ఆయువును సమకూర్చుకొన్నది - సింపుల్ పద్ధతిలో ది ఆర్ట్ అఫ్ లివింగ్ సాధించింది.
చెప్పటం మరిచాను . నేను ఇప్పుడు గేట్ తీసి వుంచుతున్నాను అది ఇల్లు జీవించి ఉన్నట్లు గుర్తు .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ ఆఫ్ అమరావతి సొంత స్మృతులు
.

**12.**భోగి పళ్ళు 20 -01 -25

నాలుగు కిలో మీటర్లు నడవ వాల్సిన అవసరం గనుక వస్తే ? రోజూ కొంత నడకను ప్రాక్టీస్ చేస్తూ క్రమముగా దానిని నాలుగు కిలో మీటర్లకు పెంచుకోవటం - అనేది శరీరానికి శక్తిని సంపాదించుకోవడం .

ఎంతకీ కొరుకుడు పడని లెక్క వున్నదనుకోండి .. ఆ లెక్కకు సమాధానము సాధించటం ఎలాగో నలుగురిని అడిగి నాలుగు రకాల ఆలోచన పద్ధతులు స్వీకరించటం -నాలుగు రకాలుగా ప్రయత్నించటం మెదడుకు శక్తిని సంపాదించుకోవడం .

ఏదన్న రోగము వచ్చిందనుకోండి - ప్రకృతికి నియమాలను అనుసరిస్తూ - రోగ నిరోధకపు శక్తిని వృద్ధి చేసుకొని - పూర్వపు ఆరోగ్యము పొందటం కూడా శక్తిని సంపాదించుకోవటమే .

ఇప్పటి మనుషులు తమకు కావాల్సిన శక్తిని సంపాదించుకోవటానికి అవసరమైన పని ఏదో అది చేయటానికి బదులు - శక్తీ అంటేఏదో కరెంటు వంటిది అని- అది గాలిలో విహరిస్తూ శరీరంలోకి రావటానికి - తహతహలాడుతూ ఉంటుంది అన్నట్లు - ఆ కరెంటును ముట్టుకొని దానిని శరీరంలోకి ప్రసరింప చేసుకుంటే చాలు-- అన్నట్లు అనేక భావనలను పెంచి పోషించుకున్నట్లు కనపడుతున్నది . మానసిక - శారీక ధృడ శక్తిని సంపాదించుకో అదినీలో ప్రవేశపెట్టుకో - అని చెప్పే వారి బదులు - శక్తి ఒక కరెంటు లాంటిది అది నీలో ప్రవేశ

పెట్టుకో అని చెప్పే వారూ .. అది విని భేష్ భేష్ అని చప్పట్లు కొట్టే వారు ఎక్కువయ్యారు .

ఈ మధ్య ఓ రేడియో ప్రసంగంలో ఒకాయన " మీరు మా యోగా ఆశ్రమానికి వచ్చి అందరితో పాటు యోగాలో కూచుంటే చాలు - మా అందరినుండి జెనరేట్ అయ్యే యోగ సెక్తి మీలోకి ప్రసరించి మీ కు అమోఘమైన యోగా శక్తీ సమకూరుతుంది " అన్నాడు . ఈయన " మీరు కష్టపడి యోగా సాధన చేయండి . అది శరీరానికి మనస్సుకు మంచిది అనటానికి బదులు -- యోగా శక్తిని ఓ కరెంటులా మీలోకి ప్రసరింప చేసుకోండి అన్నట్లు చెప్పాడు .ఇది నిజమా అని గానీ -- సాధ్యమా అని కానీ ఇవేమి ఊహలు అని అడిగే పెద్దలే లేకుండా పోయారు ?

నిన్న వచ్చిన ఒక రేడియో ప్రసంగములో ఒకరు మాట్లాడుతూ " రేగి పండ్లలో ఎంతో కాపర్ శక్తి ఉన్నది .ఆ పండ్లు తలమీద పడినపుడు అందులోని సెక్తి మెదడు లోకి ప్రవేశిస్తుంది . ఇదే భోగి పండ్లలోని విశిష్టత . అందుకే మనము ఆ పండుగ జరుపుకోవాలి అని చెప్పి నొక్కి వొక్కాణించాడు .
ఇది విని చప్పట్లు చరిచి పెద్దలే కానీ --- ఇదేమి ఆలోచన సరళి ? అని అడిగినవారు కనపడలేదు. ,
రేగి కాయలోని శక్తి - అది తింటే వస్తుంది అని నమ్మే వారికీ బదులు - దాన్ని నెత్తి మీద వేసుకుంటే
తల లోపలి కి ప్రవేశిస్తుంది అని నమ్మే వారు ఎక్కువవుతున్నారు .

నాకు ఫది ఏండ్ల వయసు వున్నపుడు - మా ఇంటి చిన్ని పిల్లలకు భోగి పళ్ళు పోయాలి అనుకోగానే - మా తల్లీ గారు నన్ను పిలిచి "ఒర్ రేగుకాయలు తీసుకురా " అని పురమాయించే వారు.
ఇలాంటి సందర్భము వస్తుందనే జ్ఞనాన్ని నేను ఇంతకు ముందే సంపాదించుకొని వున్నాను కాబట్టి - మా పల్లెటూరి చుట్టూ పక్కల పొలాల్లో ఎక్కడెక్కడ రేగి చెట్లు ఉన్నాయో గుర్తు ఉంచుకునే వాడిని . ఆపై ఏ చెట్టు కాయలు లావుగా తియ్యగా మంచి పండు రంగులో వుంటాయో గుర్తు చేసుకునే వాడిని . ఈ చెట్టు ను నా తో పాటు నా ఫ్రెండ్స్ ఎవరున్నారా చూసారా ? అనేదికూడా గుర్తు చేసుకునే వాడిని .
నేను మనస్సులో అనుకుంటూవున్నా రేగు చెట్టు ను - నాకన్నా ముందు నా

ఫ్రెండ్స్ ఎవరన్నా దోచుకొని పోయే అవకాశం ఉందా ? అని ఆలోచించే వాడిని . నేను అనుకునే రేగు చెట్టు పొదలాగా ఉంటుంది - పక్కనే పాము పుట్ట లాంటిది కూడా వుంది . అందువల్ల ఎవరూ నా చెట్టు జోలికి రారు అని సమాధాన పడేవాడిని . ఇక రేగు చెట్టు కాయలు కోయటం అంత సులువు కాదు . ఈ కొమ్మ కాయకన్నా ఆ పై కొమ్మ కున్న కాయ మరింత మంచిది అనిపిస్తుంది { అందని పండ్లు తియ్యన అన్నట్లు } . ఆ కాయను కోయపోతే రేగు ముళ్ళు చేతులకు నాటుకుంటాయి .రక్తాలు చిందుతాయి . ఆ ముళ్లను తప్పించుకుంటూ దిగ్విజయంగా కాయలు కోసే ప్లాన్ లు వేసి అమలు జరిపే వాడిని . అమ్మ 'వద్దు' అని పారవేస్తుందేమో అనే కాయల కోసము అని ఆ కాయలలో వున్నా సూక్ష్మ లోపాలు - వెతికే వాడిని .వాటిని అక్కడనే పారవేసి "శ్రమ తక్కువ ఫలితం ఎక్కువ " ఉండాలన్న సిద్ధంతాన్ని అమలు జరిపే వాడిని . ఇక భోగి పళ్ళు జరిగాక నావల్ల కదా ఇంత పండుగ జరిగింది అని ఆత్మ విశ్వాసం ఫీల్ అయ్యే వాడిని .

ఈ రకంగా భోగి పళ్ళు అని పిలవబడే రేగు పళ్ళ నుండి నేను నా బ్రెయిన్ కి కావాల్సిన ఎంతో కొంత సెక్తిని సంపాదించుకున్నాను . పెద్దపిల్లలు వెళ్లి చిన్న పిల్లలకోసం రేగిపండ్లను సంపాదించుకొని రావటమే భోగిపండ్ల ఉద్దేశ్యము - రేగి కాయలను నెత్తిన పోసుకుంటే అందులోని శక్తి పిల్లల బుర్రలోకి ప్రవేశిస్తుంది అని పెద్దలు అనుకోవటమూ , అదే సంగతిని చిన్న పిల్లలకు కూ నూరి పోయటం - బాగా ఆలోచించ దగ్గ విషయము .
రచన వారాణసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి .

**11.**నేను అప్పుడే అనుకున్నా **..** 19 -01 -25

మా నానమ్మ - మా తాత శంభు శాస్త్రి గారు మాతో అంటే మా అమ్మనాయనాలతోనే వుంటారు . మా అమ్మ నాయనలను మేము వేరుగా ఉంచాము - నాఇల్లాలు కోరిన నాగరికత కోసమని .
నాగరికత అని ఎందుకు అన్నాను అంటే " ఇప్పుడెవరూ బ్లాక్ అండ్ వైట్ సినిమాలు చూడటం లేదు - అన్నట్లు " ఎప్పుడెవరింట్లోనూ అత్తా మామలు ఉండటం లేదు " అని నా భార్య అన్నందున అట్లా అన్నాను .

మా  శంభు తాత  గారికి  నలుగురు అన్నతమ్ముళ్లు . అయన తమ్ముడు ఒకరు ఈయనకంటే రెండేండ్లు చిన్న వాడు . పేరు గిరి శంకరం గారు అని వుండే  . సరే ఇప్పుడు ఆయన్ను తీసుకెళ్లి అవుట్ డోర్స్ లో పెట్టారు -  అయన  కోడలు నేను చేయలేను-  అంటూ తన భర్తకు సహాయ నిరాకరణ ప్రకటించటం వలన ఆయన్ను తీసుకెళ్లి ఓ వృద్ధాశ్రమం లో చేర్చారు .

తన తమ్ముడు శంకరానికి అట్లా అయింది అన్న ఆకబురు విన్న  మా శంభు తాతగారు ఓ నిట్టూర్పు విడిచి "అట్లా అవుతుందని నేను అప్పుడే అనుకున్నా .  " అన్నాడు .

" ఏదన్నా జరిగినాక.-- అట్లా  జరుగుతుందని  నేను  అనుకుంటూనే వున్నాను" అంటూ తమకు  ఏదో కాలజ్ఞానం ఉందన్న   ఫీలింగ్  ఇవ్వటం  అందరికీ ఓ పరిపాటి ఐ పోయింది " అని మా తాత మీద నాకు ఓ చికాకు  వచ్చింది .  అదే చికాకుతో " ఎప్పుడు అనుకున్నారు ? ఏమను కున్నారు ? అని    అడిగాను . నేను సత్యం ఏమిటే అనేది తెలుసుకునే దిశగా ఈ ప్రశ్న అడిగానని అర్థం చేసుకున్నారో ఏమో మా తాత గారు పెద్దగా ఏమీ ఫీల్ అయినట్లు కనపడలేదు .

" ఎప్పుడంటే ? మొన్నటి నెల  వాళ్ళింటికి వెళ్ళాము కదా ? అప్పుడు  మీ పిన్నమ్మ   మనల్ని చూసి-  వంటకి ఉపక్రమించటానికో లేదా  -  ఆన్ లైన్ భోజనాలు తెప్పించటానికో  కూడా ప్రయత్నించకుండా గుండ్రాయల్లే కూచుంది . ఈ రకంగా ఏ ఇల్లాలు అయితే వంట చేయటము   - వడ్డించటము - అతిధులను ఆదరించటమూ తనకో  భారము అనుకుంటుందో - అలాంటి ఇల్లాలు తన అత్తా మామ లనే  కాక ,చివరికి   భర్తా పిల్లలు అంటే కూడా భారమేనూ  అనుకునే స్థితికి దిగజారు తుంది   అని నేను నేను అప్పుడే అనుకున్నాను . అందువల్లే మీ చిన్న తాత - వున్న ఇంటిలోనుండి  పోయి అవుట్ డోర్స్ లో పడ్డాడు .అదీ సంగతి . ఎప్పుడైతే ఆడవారు తమ ఇంటి కి చెందిన మొగవారిని భారంగా భావిస్తారో అప్పుడే ప్రంపంచ నాశనానికి బీజం పడినట్లు అని - ఫ్రెంచ్ వేదాలలో చెప్పారు,అనే సంగతి కూడా నేను  నీ కిప్పుడే  చెపుతున్నాను తెలుసుకో " అని అయన అన్నాడు .

ఎంతో సంభాషణ అనంతరం---  "ప్రంపంచ నాశనానికి బీజం పడినట్లు "అని  మా తాతగారు అన్న మాటలలోని  లోతు పాతులు  ఏమిటో తెలుసుకో  గలిగాను . "ఏ తరపు మొగవారైనా ఎంతటి ముసలి వారైనా సరే - మొగ జాతి వారు  అంటే వీలున్నంత వరకూ   ఏదో ఒకటి చేసి తన కుటుంబానికి  శక్తినీ  సంపదను ఇవ్వాలని ఆలోచించే మనిషి  లేదా ఇచ్చిన మనిషి . ఈ సృష్టి అతనికి ---మొదట కష్టించు తుదకు సుఖించు -- అనే తత్వాన్ని  బోధించి - అదే ధ్యేయంగా జీవించమని జన్మను ఇస్తూ వున్నది  . కానీ  స్త్రీ జాతి తాము  ఇంటి మీద అధికారం పొందినాక  -సృష్టి తత్వాన్ని  వ్యతిరేకిస్తూ మొగజాతి వారిని   " నీవు నా ఇంట్లో వద్దూ"  అనగా నీవు తుదకు సుఖించటం వంటి ఆలోచనలు పెట్టుకోకూ అంటూ వున్నది .  ఇట్లాంటి "వద్దూలు " అనేకం చూస్తూ వున్నా మొగవారు   - నేను  " ఇంకా - కష్టపడాలి" 'ఇంకా    సంపాదించాలి " అనే  పూనిక పూనరు కదా ?   దీనితో ప్రపంచం నాశనానికి బీజం పడ్డట్లు  కదా ?? అని  నేను అప్పుడే అనుకున్నా .." అని ఆయన చెప్పాడు .

" అంతే అవుతుందేమోలే తాతా ?మనకెందుకు.  నాకిప్పుడు ముప్పది  ఏండ్లు   . నేను ఇప్పుడిప్పుడే " పెద్దైనాక ఎటూ పోయి అవుట్ డోర్స్ లో  పడే లైఫ్  కోసం ఈ ఉద్యోగాలు వ్యాపారాలూ ఎందుకు ? ఇన్కమ్ టాక్స్ లు కట్టటం ఎందుకు ?  ఎదో ఒక వృద్దాశ్రమానికి కట్టగలిగేందుకు అని  ఇంత సేవ్ చేసి పెట్టుకుంటే సరిపోదా ?? అనుకుంటూ వుంటాను .  నా లాగ నలభై మంది అనుకున్నా నీవన్నట్లు ఈ ప్రపంచ నాశనం తప్పదు  "అని నేను నా అభిప్రాయము వెలిబుచ్చాను . 'నువ్విట్లా అంటావని  నేను అప్పుడే అనుకున్నా .." అని  శంబు తాత గారు మళ్ళా అన్నాడు . ఈ డైలాగ్ అయన స్టాండర్డ్ అండ్ రొటీన్ డైలాగ్ లా వుంది  .. దీనిని గురించి ఎక్కువగా ఆలోచన చేయటం వేస్టు అను కున్నాను .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి స్వంత కథ

**10.ఆమె అందుకే వచ్చింది     18 -01 -25**

నేను స్నానమూ అదీ చేసి దేముని పూజలకు సిద్ధము అవుతూ వున్నాను . వాకిట్లో నుండి ఎవరో కాలింగ్ బెల్ వాయించ సాగరు .విసుక్కుంటూ వెళ్లి తలుపు తీసి చూసాను . ఇంటిలోనుండి చెత్తను కలెక్ట్ చేసుకునే మా మున్సిపాలిటీ వారి మనిషి నుంచొని వున్నది .
"ఏమిటమ్మా ఒకటే పని గా గంట వాయిస్తూ వున్నావు ? " అన్నాను నేను అసహనంగా .
" చెత్త ఇవ్వండి " అని ఆమె డిమాండ్ చేసింది .
"రేపు ఇస్తాము "
"తలుపు కొట్టి మరీ అడుగుతున్నాను కదా ? ఇప్పుడెందుకు ఇవ్వరు ??"
" ఎందుకంటే ? నువ్వు రోజు ఏ టైంకి వస్తావో మాకు తెలియటం లేదు . ఒక రోజు ఉదయం ఆరింటికే వస్తావు . ఒకరోజు ఎనిమిదింటికి వస్తావు .ఇదిగో ఇప్పటిలా పదింటికి పదకొండింటికో కూడా వస్తున్నావు . ఇవాళ్టి మా రోజు స్టార్ట్ అయి పోయింది . అంటే మా రొటీన్ లైఫ్ మొదలైపోయింది . అందుకని రేపురా పో " అన్నాను .
ఆమెగుమ్మం పట్టుకొని వదలకుండా " పాల పాకెట్ ఎప్పుడు వస్తే అప్పుడు - పనిమనిషి ఎప్పుడు వస్తే అప్పుడు రోజును మొదలేస్తారు కానీ - మేము ఎప్పుడు వస్తే అప్పుడు రోజును మొదలెయ్య లేరా ?ఏం ? ఎందుకని ?? వాళ్ళకంటే మేము ఎందులో తక్కువ ? నాకు చెప్పనన్నా చెప్పండీ లేదంటే చెత్తనన్నా ఇవ్వండి " అని డిమాండ్ చేసింది .
ఆమె అందుకే వచ్చింది అంటే చెత్తకోసము అనేకాక తన తక్కువ ఏమిటో తేల్చుకోవటానికే వచ్చింది .

ఇప్పుడు నేను చెత్తను పట్టుకుంటే దేముని పూజ కోసం కట్టిన "నా మడి" కాస్తా మాయం ఐ పోతుంది . దేముని పూజ కూడా లేటు ఐ పోతుంది ఎట్లాగా అని ఆలోచించటం తో పాటు - ఆమె తక్కువ ఏమిటో కూడా ఆలోచించ వలసి వచ్చింది .

వారణాసి ఉమా శ్రీరామ కృష్ణ అఫ్ వారణాసి సొంత కథ

**9.**అమ్మా  మీరు ప్రతిబింబించ వలే --     15 -01 -25

ఒక ఇండో ఆఫ్రికా దేశానికి -  అంటే భారతీయుల ప్రభావము ఎక్కువగా పడిన  ఒక ఆఫ్రికన్ దేశానికి మన ఆంధ్రావాడే  ప్రెసిడెంట్ అయినాడు . అయన ప్రెసిడెంట్ కాగానే అయన  భార్య అయినా ఆంధ్రా లేడీ కూడా-- లేడీ ప్రెసిడెంట్ అయ్యింది అన్నారు .

అప్పుడు ఒక ఆఫ్రికన్ అధికారి లేడీ ప్రెసిడెంట్ వద్దకు వచ్చి " అమ్మా మేడం గారూ - మీరు మన దేశపు లేడీ ప్రెసిడెంట్ హోదాలో - ప్రెసిడెంట్ గారి వెంట అనేక దేశాలు పర్యటించ వలిసి ఉంటుంది . అంతే కాకుండా మీరు పర్యటించే అన్ని దేశాలలోనూ " ఈ దేశపు మహిళా నాగరికతను ప్రతిబింబించ వల్సి ఉంటుంది - అందుకోసము అని  మేము మీకు కొన్ని విషయాలు నేర్పుతాము . ఆ నేర్పేవారు నా కూడా వచ్చి మీ అనుమతి కోసం ఎదురు చూస్తూ వున్నారు "అని విన్నవించాడు .

అప్పుడు లేడీ ప్రెసిడెంట్ అన్నది కదా " ఓర్నీ సత్యనారాయణ మూర్తీ - నాగరికతను ప్రతిబింబించ టానికి అనిచెప్పి   - ఎవరి దెగ్గరనుంచో  ఎదో నేర్చుకోవాల్సిన ఖర్మం ఏ  ఆడ దానికీ   రాదు . ఆడది పుట్టటమే నవ నాగరికంగా పుడుతుంది .  నేను అయన పక్కన నిలబడి " మీకేమీ తెలీదు మీరు ఊరుకోండి " అంటూ ఉంటేనూ  " ఆగండి ఆగండి " అన్నట్లు అయన చేయి పట్టుకొని గుంజుతూ ఉంటే నూ  సరిపోతూ ఉంటుంది  . దీనితో ప్రపంచం లోని ప్రతి మహిళా కూడా నేను మన దేశపు నాగరికతనే కాకుండా ప్రపంచ ము  యొక్క మహిళలందరి నాగరికతను  ప్రతిబింబిస్తూ వున్నాను అని గ్రహించుకుంటుంది    . ఇహ  నేను మనదేశాన్ని   ప్రతిబింబించాలి అంటే నేనేమి చేయాలో నీ మట్టి బుర్రకు తట్టి నట్లు లేదు  - నువ్వు వెంటనే వెళ్లి - డీబీర్స్ నుండి  ఓ ఫది వజ్రాల హారాలు - పారిస్ ఫాషన్ సెంటర్  నుండి ఓ పుంజీడు బంగారు జరీ చీరలు.  అరపై లేటెస్ట్ డిజైన్ రవికలు  తెప్పించు . ఏ నాగరికతను ప్రతి బింబించాలన్నా ఆడదాని నడుముకు ఓ బంగారపు ఒడ్డాణము --అదీ రత్నాలు కెంపులు పొదిగినది - దానికి మ్యాచింగ్ నగలు  ఉండటం ఎంతో అవసరం అని కూడా  తెలుసుకో -- ఇహ నువ్వు వెళ్లి ఆయన్ని ఇట్లా పంపు .  ..  అయన గనుక వెంటనే  కుర్చీ దిగి రాలేదనుకో -

ఆయనకే నాగరికత అంటే ఏమిటో నేర్పవలిసి ఉన్నట్లు . ఆ పాఠాలు ఏమో ఆయనకే నేర్పండి " అన్నది .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి యొక్క సొంత కథ

నా వివరణ - . తాము చెప్పినది అర్ధం చేసుకున్నా చేసుకోక పోయినా , తన భార్య హుందాగా చిరునవ్వుతో - ఆమోదపూర్వకంగా తల ఊపాలని ప్రతి పురుషుడూ కోరుకుంటూ ఉంటాడు .కాబట్టి - వారు అది నేర్చి , పాటించి ఆంధ్రుల నాగరికతను మౌంట్ ఎవరెస్ట్ ఎత్తునకు తీసుకు పోవాలని నా కొరికి

**8.**నేడు నాకు మాతృ భాషా దినోత్సవం. 14 -01 -25

ఇలాంటి దినోత్సవాలు ఒక కేలెండర్ తేదీ ప్రకారం రావాలి గానీ? ఇదేమిటి అంటే .? ఇట్లా జరిగినపుడు మాతృభాషా దినోత్సవం జరుపుకోవటం కూడా ఒప్పే ను అని మీరు అననట్లు .

నేడు 14 -01 -25 న సంక్రాంతి పండగ . నా దృష్టిలో ఇది ముగ్గులు వేసే కళను రక్తం లోని వారసత్వంగా పొందిన అడ పిల్లల కోసం పెట్టిన పండుగ అని.

మాఇంటికి ముందు వారి వాకిటి లో ఓ ఫదేళ్ల వయసు పిల్ల ముగ్గులు తీర్చిదిద్దుతున్నాది. ఆమెలో ఎంతో " కళ " వున్నదని ఆ ఇంటి యజమానురాలు ఒప్పుకున్నదికాబట్టే తన, ముగ్గు చిప్పను కలర్సును ,ఒక ప్లేటులో ఉంచి ఈ చిన్న దాని చేతిలో పెట్టి పోయింది అని మనము గ్రహించుకోవాలె . ఈ పదేండ్ల చిన్న దానితో పాటు పిల్లతో పాటు ఓ పన్నెండు ఏళ్ల పిల్ల కూడా వచ్చింది . విధి వశాత్తు ఈ పెద్ద పిల్ల తన సీనియారిటీ కోల్పోయి , ఆ చిన్న దానికి అసిస్టెంట్ లాగా అయ్యి ఆపిల్లకు ముగ్గులు కలర్స్ అందిస్తూ వుండవలసి ఒచ్చింది .

పెద్ద పిల్లలో ఉక్రోషం అంటారే అది ఆగటం లేదు . ఇలాంటి పరిస్థితిలో మీరు ఉండి మీరు ఏమి ఫీల్ అవుతారో దాన్ని ఉక్రోషం అంటారు .

పెద్ద పిల్ల ఉక్రోషం ఆపుకో లేక " నీవి ముగ్గులు కాదు. కోడి గీతలు" అని దెప్పి వెళ్లి పోయింది .
" నీవి ముగ్గులు కాదు. కోడి గీతలు" అని ఆ పిల్ల అన్నపుడు - దానిలోని అర్ధం బోధ పడినపుడు -
తెలుగు భాషకు ఇంతకు మునుపు లేని ఒక జాతీయ పదం ఈ పిల్ల జోడించింది అనుకున్నపుడు --నాకు ఈ నాడే నా మాతృ భాషా దినోత్సవం కదా ? అనిపించింది .

ఇందులో ఏమివుంది అనుకునే వారి కోసం చెప్పేది ఏమిటంటే - " కోడి తన పిల్లలను వెంటవేసుకుని వాటి మేతకోసం అని నేలను కాళ్లతో గీకుతూ ఉంటుంది . అంటే అది ఒక ముగ్గు వేస్తున్నది అనుకోనుకూడా వచ్చు . కోడి ముగ్గు వేస్తే ఎలావుందో - అంటే నేలను గీకుతూ ఉంటే ఎలాటి డిజైన్ వస్తుందో -- నీ ముగ్గు అలంటి డిజైన్ లో కి వచ్చింది అని పెద్ద పిల్ల చిన్న పిల్లను వెక్కిరిస్తూ ఒక అపురూపమైన జాతీయ పదాన్ని సృష్టించింది . ఇప్పుడు మీరు కూడా నా లాగే అనుభూతి చెందితే " మన తెలుగు భాష మరణించి పోతోంది" అనే ఆందోళనలో మీరు పడరని నెను ఊహిస్తాను .
చిన్న పిల్ల మొక్కపోని పూనిక తో ముగ్గులు పూర్తి చేసింది . ఆపై " ఆంటీ ముగ్గుకు ఇండియన్ కలర్స్ వేయనా ?" అని ఇంటి యజమాను రాలూనీ ఉద్దేశించి అడిగింది . చైనా కలర్స్ అనేవి ఏమైనా వచ్చాయో ఏమో? అని నేను అనుకున్నాను . " అవేం రంగులు ?" అని ఆ ఆంటీ కూడా అడిగింది .
" అవే ఆంటీ -- ఎరుపు తెలుపు పచ్చ రంగులు " అన్నది . ఈ పిల్లకూడా " ఇండియన్ కలర్స్ అనే నూతన మాటను సృష్టి చేసింది . ఈ మాట తెలుగు కాకా పోతే నేమి . పిల్లలో దేశభక్తి భావజాలం - తెలుగులో నే కలిగి - తెలుగులోనే వికసిల్లి , ఇంగ్లీష్ లో వెల్లడి అవుతూ వున్నదని తేలుతూ వున్నది కదా? అది చాలదా మనకు ?

చిన్నపిల్ల ముగ్గు ఎట్లాగో పూర్తి చేస్తుంది - దాన్ని ఫైనల్ గా చూసి ఫైనల్ గా ఒంకలు పెడుదాము అన్నట్లు ఆ పెద్ద పిల్ల మళ్ళీ వచ్చింది . ఆ పిల్ల వస్తుంది అని ఈ చిన్న పిల్ల ఊహించే ఉంది . ముగ్గు మొత్తానికి సెంటర్ అట్రాక్షన్ లాంటి

ఇండియన్ కలర్స్ వేసిన పద్మ ఆకారపు ముగ్గు మీద తన చేతిలో వున్నా వెడల్పాటి  స్టీల్ పళ్ళెరాన్ని బోర్లించి పెట్టి ఉంచింది .

ఇందాక ఇదే ముగ్గును నిరసించిన పెద్ద పిల్ల - చిన్న పిల్లతో బ్రతిమిలాటకి దిగి ముగ్గు చూపించు
అని అతి మాడెస్ట్ గా అడిగింది . చిన్న పిల్ల కూడా అతి బెట్టుకు పోకుండా ముగ్గు మీద కప్పిన పళ్ళెరాన్ని తొలగించి  తన పెద్ద మనసును చాటుకుంది . ఇదంతా తెలుగు సంస్కృతి లోనుండి వచ్చిన అత్యుత్తమ ప్రదర్శన ఏ కదా అనే నేను అనుకున్నాను .

తెలుగు వారిని గురించి సంతో షించటానికి ఎదో ఒకటి దొరికిన ప్రతి రోజు నాకు మాతృ భాష దినోత్సవమే నండీ.

నిజ సంఘటను విశ్లేషించి మీకు చెప్పే ప్రయత్నం చేసిన వాడు మీ వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి .

## 7.మా పేరి శాస్త్రి        13-01-25

మా ఇంట ఒక తద్దినం పెట్టవలిసి వస్తే మా ఇంటి బ్రాహ్మణుడు ఐన పేరి శాస్త్రి గారిని తప్పక సంప్రదిస్తాము . బ్రాహ్మణులూ అనేవారు లేకుండా తద్దినం పెట్టటం కుదరదు కాబట్టి - పేరి శాస్త్రి గారు ఈ కథలోకి వచ్చాడే గానీ వేరే కారణం ఏదీ లేదు .

పేరి శాస్తులు గారు వచ్చి " అలాగేనండి . మరి "తిన" టానికి  ఎంతమంది భోక్తలు కావాలి ? అలాగే 'విన'టానికి కూడా ఎవరన్నా కావాలా ?" అని అడిగాడు .

"తినే వారు సరే -- ఈ వినే   వారు ఎవరండీ ? అని నేను ఆశ్చర్యా పడ్డాను .

"మీరు తద్దినాలు ఎదో అడపా తడపా పెడుతూ వుంటారు . అందువల్ల ఈ తద్దినాల రంగం లో వస్తున్న మార్పులు మీకు పెద్దగా తెలిసినట్లు లేవు -- మీరు ఇచ్చే దానికోసం మీరు పెట్టినది తిని మీకు అదో సంతృప్తి కలిగించే వారు వున్నట్లే - మీరు ఇచ్చే దానికోసం - మృతుడి గురించి మీరు చెప్పిన మాటలు శ్రద్ధ గా విని మీ హృదయ భారాన్ని దింపివేసే వారు అంటే శ్రోతలు కూడా వస్తారు . మీరు కనుక వినే వారు తినే వారు ఇద్దరూ ఒకరే అవుతే బావుంటుందని కోరుకుంటే - వారికి మామూలుకన్నా రెట్టింపు దక్షిణ , అంటే భోక్తకు వెయ్యి బదులు రెండు వేలు ఇవ్వాలి . తినే వారు వినే వారు వేరు వేరుగా కావాలంటే ఇంకొంచెం ఎక్కువ దక్షిణ అవుతుంది ."

" ఈ వినే వారు వచ్చి ఏమి చేస్తారండి ?"

" భోక్తలతో పాటుగా ఈ" వినే " వారికి మడి కట్టించి వారిలోకి పితృ దేవతలను ఆహ్వానిస్తాము . అప్పుడు మీరు కానీ - మీ ఇమీల్లాలు కానీ - మీ పిల్లలు కానీండి ఇలా మీలో ఎవరైనా సరే వారితో మీ ఇష్టం వచ్చిన విషయము ఇష్టం వచ్చినంత సమయం మాట్లాడవచ్చు . చని పోయిన వారిని మీరు ఎంతగా మిస్ అవుతున్నారో వారితో చెప్ప వచ్చు . వారు లేని లోకం మీకు ఎట్లా ఉందొ విప్పి చెప్పుకొని - వారి ముందు దుఃఖించవచ్చు .ఇలాంటి పనులు మీ ఇంట్లో వారి ముందు మీరు చేస్తే ఎవరూ పట్టించుకోరు గదా ? ఆ సౌకర్యము కల్పించటమే దీనిలోని అసలు ఉద్దేశ్యము . ఇంతే కాక -- మృతుడు సరిగ్గా కష్టపడకుండా - సరిగ్గా సంపాందించి , సరిగ్గా దాచకుండా దాటి పోవటం వల్ల మీరిప్పుడు ఎన్ని కష్టాలు పడుతున్నారో అనే లాంటి సంగతులు వారితో ముచ్చటించవచ్చు. .--- " నలుగురిని కని మూడు బిల్డింగ్లు మాత్రమే కట్టించిన నీ తెలివి ఏపాటిది ? అని వారిని నిందించవచ్చు" " ఆ కోటి రూపాయలూ షేర్ మార్కెట్లో బదులు - రియల్ ఎస్టేట్ లో పెట్టుబడి పెట్టాలని తెలీని వాజెమ్మవు .మమ్మల్ని ఎందుకు కన్నావు అని -- దూషించవచ్చు .. గతించి పోయిన వారికి ఇష్టమని తినే వారికి ఎన్నో రకాల వంటకాలు వడ్డించి పెట్టినట్లు - ఈ వినేవాళ్లలో మీ పితృ దేవతలను చూసుకుంటూ వారిని ఏ విధంగా నైనా దుయ్యపట్టి ఏ గడ్డి అయినా పెట్టవచ్చు "

ఇట్లా జరుగుతూ ఉండగా నా ఇల్లాలు తలుపు చాటునుండి బయటికి వచ్చి "మామ గారూ -- అత్తగారి కోసం చేయించిన బంగారం లో సగం కనపడలేదు . ఏ ముండకు ఇచ్చారు ? పేకాటలో ఒడి -- రాసిచ్చింది అర ఎకరానా? ఆరు ఎకరాలా ? మీరు మాకేమి ఇచ్చింది లేకపోగా-- మీతద్దినపు ఖర్చులు వల్ల మేము ముండమోసాము . మీరు మా చేతికి చిప్పమిగిల్చారు " అంటూ నేను మా మామగారిని దుయ్యపట్టవచ్చా " అని అడిగింది .

" అమ్మా -- ఇందు కలడా అందు లేడా అనే సందేహమే వలదన్న రీతిగా - ఆది అడుగవచ్చా ? ఇది అడుగరాదా ? అనే సందేహమే వలదు , మీరు వినే వారితో ఏదైనా చెప్పవచ్చు - వారిని ఏమైనా అనవచ్చు . "వినే" వారు వినకపోతే- తిట్టినాతిట్లూ పడక పోతే నన్ను చెప్పుచ్చుకో కొట్టండి "అని పేరి శాస్త్రి భరోసా ఇచ్చాడు .

అప్పుడు నేను పేరి శాస్త్రి తో " నాకు తినే వారు చాలు _ ఇప్పటికే ఖర్చులు దండిగా అవుతున్నవి " అన్నాను .

మా ఆవిడా మళ్ళా ముందుకు వచ్చి " నాకోసం అని వినే వాళ్ళని ఇద్దర్ని పట్టుకు రండి .మార్చి మార్చి ఉతికి ఆరవేస్తాను . కావాలంటే ఇదిగో అడ్వాన్స్ " అన్నది . ఆమె అంతటితో ఆగకుండా " ఇంకో నెలలో మా అత్తగారి తద్దినం కూడా రానుంది . అప్పుడు ఆడవారిని "వినే" వాళ్ళుగా తీసుకో రండి . ఆమె ఎదురుగా నేనూ నా తోడుకోడళ్ళము నలుగురం తేల్చుకోవాల్సింది ఎంతో కూడా వున్నది " అన్నది .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి సొంత కథ




**6.**నాకిప్పుడే పెళ్లి వద్దు **08 -01 -25**

మాకు బాగా తెలిసిన అబ్బాయికి, పెళ్లి నిర్ణయము అయ్యింది. కానీ వధువు వరుడూ ఇద్దరూ కూడా పెళ్లి కోసం మరింకో రొండు మూడు సంవత్సరాలు అగుతామన్నారు అని తెలిసింది . ఇప్పటికే అమ్మాయికి 34 అబ్బాయికి 38 వచ్చాయని స్పష్టంగా తెలుసు కున్న మేము- ఈ ఇద్దరి మధ్యా జోక్యం చేసుకుని పెళ్లి త్వరగా జరిగేట్లు చూస్తే - మా పెద్దరికానికి వన్నె రావటం తో పాటు ఏదన్నా పుణ్యం వస్తుందేమో అనే ఆలోచన కూడా కలిగింది . మేము అంటే నేనూ నా భార్య , ఈ పుణ్య కార్యానికి నడుము కట్టాము .

నేను వెళ్లి ఆ అబ్బాయితో " నాయనా పెండ్లికి ఇంకా రొండేళ్లు ఆగుతాను అన్నావట . అప్పటికి నీకు వయసు నలభై వస్తుంది . అప్పుడు ఏమి బావుకుందా మని ? నామాట విని తొందరగా పెళ్లి చ్చేసుకుని పిల్లాడ్ని కని మీ వంశాన్ని తరింప చేయి . మీ అమ్మా నాయనా త్వరగా మనుమని ఎత్తుకుందామని ఆశ పడుతూ కూడా ఉండవచ్చు . .నిర్ణయమైన పెండ్లికి ఇంకా ఎందుకు ఆలశ్యము ?. కానివ్వరాదా ? అన్నాను . అతను ఏమీ మాట్లాడలేదు . " నాయనా .. నేను నీకు బయాయి వరుస . అందువల్ల నీమనసులో ఏముందో చెప్పూ " అని నేను ఎంతో బ్రతిమాలినాక అతడు నోరు విప్పాడు .

" మీ తరంలో పిల్లలు ఎట్లా పుట్టే వారండి ?" అని అతడు అడిగాడు . పిల్లడు అఖండ పిండం లాగా వున్నాడు . కొన్ని యుగాలుగా పిల్లలు పుడుతున్న తీరు ఏమిటో ఇంకా తనకు తేలినట్లు మాట్లాడుతున్నాడు " అనుకోని - అయితే కొత్త దారీ అదీ - కొంచెము చేమత్కారము ఐన దారి తోకుదాము అని నేను నిర్ణయించుకొని - " మా రోజుల్లో - పెళ్లి చేసుకొని పెళ్ళాన్ని గట్టిగా కౌగలించుకుంటే పిల్లలు పుడతారని చెప్పారు- మాకు అట్లాగే పుట్టారు "అన్నాను . ఈ సమాధానము చెప్పటం వల్ల నేను నక్క తోక తొక్కినా వాడి నే అయ్యాను అనుకోవాలె . అతడు మనస్పూర్తిగా నవ్వి - నేరుగా విషయానికి వచ్చాడు " మొదట్లోనేనూ అట్లాగే అనుకునేవాడినండి . పెళ్ళాన్ని గట్టిగా కౌగిలించుకుంటే పిల్లలు పుట్టేస్తారు అనే అనుకునే వాడిని , కానీ సంతాన సాఫల్య కేంద్రాల వారు ఇస్తున్న ఇన్ఫర్మేషన్ చూసి .- పిల్లలు పుట్టటం అంత ఆశామాషీ పని కాదని- దానికి ఎంతో మెగా శక్తి అవసరమని తెలుసుకున్నాను .ఆ మెగా శక్తీ నాలో ఉందొ లేదో నా అంచనాకు అండటమే లేదు. ఇక ఎందువల్లనైనా సరే నాకు కనుక పిల్లలు పుట్టక పోతే -- నాలో మెగా శక్తీ ఉందోలేదో చూడటము కోసం అని నా భార్య నన్ను హాస్పిటల్స్ చుట్టూ తిప్పుతుంది .నన్ను వదిలేస్తానని కూడా బెదిరిస్తూ ఉంటుంది . నలుగురిలో - అదో తల ఒంపులు. అదో గొడవ . అదే నేను కనుక 40 దాటి నాకా పెళ్లి చేసుకున్నాననుకోండి - వయసు ముదిరినందున వాడికి పిల్లలు పుట్టటం కష్టం అని - ఎవరికీ వారే సర్ది చెప్పుకుంటారు .ఎవరూ నాజోలీకి రారు . నాకు మొగతనం టెస్టులు చేయించరు . 40 దాటితే నేను సేఫ్ జోనులోకి వచ్చినట్లే కదా ? అందుకని ఇంకా రొండేళ్లు ఆగి 40 దాటి , సేఫ్

జోనులోకి పడి నాక నే పెళ్లి చేసుకుందామని నిర్ణయం తీసుకున్నాను " అని అతడు నిట్టూర్చాడు .

" మా నాయనా ఎంతో మంచి వాడవురా ? స్వల్పంలో నీ మనసులో ఏముందో అది చెప్పి నాకు తిప్పలు తప్పించి నావు . సరే -- ఈ రోజులలో ఆడపిల్లలలు కూడా తమకు కాబోయే వాడితో అరమరికలు లేకుండా అన్నీ మాట్లాడుతూ ఉన్నారట . "ఈ పిల్లలు పుట్టట", అనే విషయం మీద ఆ పిల్ల ఎమన్నా చెప్పినదా ? "

" ఆ చెప్పింది . మొన్న మొన్నటి దాకా - ఆమె కూడా "ఆడా మోగా ఇష్టంగా ముద్దులు పెట్టుకుంటే పిల్లలు పుడతారు" అనుకునేదిట . ఆ తరువాత నాలాగే సంతాన సాఫల్యాల వాళ్ళ టీవీ ప్రోగ్రామ్లు చూసి ఎన్నో విషయాలు తెలుసుకొని - పిల్లలు పుట్టటం అంటే మామూలుగా అయ్యే పని కాదని - అందుకు స్త్రీ లో ఎన్నో సున్నిత మైన వింత వింత మార్పులు జరగాలని - అలాంటి మార్పులు తనలో వస్తావా ? రావా ? పిల్లలు పుడతారా? పుట్టారా ? అని ఆందోళనలో పడిందట . పిల్లలు పుట్టకపోతే నా అత్తామామలు ఊరుకుంటారా ?నన్ను టెస్టింగులు చేయిస్తారు . అందుకని 35 దాటినాక పెండ్లి చేసుకుంటే - నా అత్తా మామలు "ఆ 35 దాటినాక - ఈమెకు ఇంకా పిల్లలేమి పుడతారులే" అని అనుకోని నన్ను క్షమించేసి నాతో మంచిగా వుంటారు .కుటుంబం లో కలతలు కష్టాలు వుండవు . అందుకని 35 ఏళ్లకు ముందే పెళ్లి చేసుకుని లేని పోనీ తల నెప్పులు తెచ్చుకోవటం ఎందుకు ? మనము నాకు 35 దాటినాక పెళ్లి చేసుకుందాము అని ఆమెనే అన్నది . కాగల కార్యము గంధర్వులే తీర్చారు అన్నట్లు అనిపించి నేను కూడా ఒకే అన్నాను " అని అతడు చెప్పాడు .
" అంతా బాగానే వుంది మరి నిజంగా పిల్లలు పుట్టటం ఫెయిల్ అయితే ఏమి చేస్తారు ? అన్నాను " డాక్టర్ గారికి ఐదారు లక్షలు ఇచ్చి సంతాన సాఫల్యము పొందుతాము అంటే టెస్ట్ ట్యూబ్ బేబీని తెచ్చుకుంటాము . ఇదైతే ఎవరికీ మాట రాని పని" అని అతడు అన్నాడు .

"ఇలాంటిది మనకు కూడా నోటా మాట రానివ్వదు కదా ? అని నేను అనుకుని చక్క లేచొచ్చాను .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి యొక్క సొంత కధ .

**5.**కుక్క కూ ఓ స్వయం ఉపాధి **06-01-25**

పార్క్ లో ఈవెనింగ్ వాక్ చేస్తూ వున్నాను . నాకన్నా ముందు ఇంకో అయన వాక్ చేస్తూ వున్నాడు . అయన వెంట ఓ కుక్క కూడా వాక్చేస్తున్నది . అది అయన కుక్క అనుకోవటానికి వీలు లేకుండా - ఇండిపెండెంట్ గా నడుస్తూ వున్నది .సరే ఆయన్నీ అయన కుక్కనీ అలాదాటి పోనిచ్చి -మనము ఈ పార్కులోని ఎదో ఒక మారు మూల పొదచూసి దాని పక్కన ఆగి కాస్త జిప్ తీద్దాము అనుకున్నాను . మీరు గమనించారో లేదో మొగవాళ్ళకి కాస్త స్వేచ్ఛ తో కూడిన వాతావరణము కనపడగానే ప్రకృతి వాళ్లకు ఎదో పర్మిషన్ ఇచ్చేస్తుంది . జిప్ తీసి పోసేయమని . నేను అలంటి పర్మిషన్ నే పొందాను . ప్రకృతి ఇచ్చిన పేర్మిస్షన్ కి మరింక ఎదురు లేదు అను కొని నేను ఓ పొద చాటుకు జరిగి జిప్ తీయ బోయాను . ఇందాక నేను చూసిన కుక్క షడన్ గా దిక్కు మార్చుకొని నా ముందుకు వచ్చి కూచొని " భౌ భౌ " మనింది. పిచ్చ డీ జె సౌండ్ తో . ఇంతకు ముందు కుక్క ముందు నడుస్తూ ఉన్నాయని వెనక్కి తిరిగి నా వద్దకు నింపాదిగా వచ్చి " ఇదిగో ఈ ఐదు రూపాయల గుడ్ డే బిస్కెట్ పాకెట్ దాని కి వెయ్యండి . మీకు పర్మిషన్ ఇచ్చి వెళ్లి పోతుంది ." అన్నాడు . అది అట్లాగే చేసింది.

"నేను ఆయనకు దణ్ణాలు పెట్టి " నా పురుష స్వేచ్ఛను రక్షించారు థాంక్స్" అన్నాను . అయన అందుకు బదులుగా " దానికి స్వయం ఉపాధి పధకం లాగా ఆ విద్య నేర్పింది నేనేను. మీకు స్వేచ్ఛను ఇప్పించినందుకు నాకు పది రూపాయలు ఇవ్వండి . రేపు మీలాగే నాకెవరన్నా తారస పడితే కుక్కకు ఇవ్వటానికి ఒక ఐదు , ఇప్పుడైనా ఖర్చుకు ఒక ఐదు" అన్నాడు,

అయన చూడటానికి చాల పెద్దమనిషి లాగా చేతిలో రెండులక్షల సెల్ ఫోను తో వున్నాడు . నేను ఆయనతో "ఏది ఏమైనా మీరు దానికి చక్కని స్వయం ఉపాధి నేర్పారు . మరి ఈ స్వయం ఉపాధి దానికి నేర్పటానికి అని మీరీ పార్కుకు

వస్తారా? లేక అది మాలాంటి వారిని అటకాయించి మీకు అందించే ఆనందాన్ని పొందటానికి పార్కుకు వస్తారా ? " అని అడిగాను . సీరియస్ గా కాదు - మంచి చిరునవ్వుతో అడిగాను .

నా చిరునవ్వులో అయన తన ఫ్రెండ్ ని చూసుకొని వున్నాడు కాబోలు . అందుకని ఇట్లా అన్నాడు "నాకు 40 వచ్చినాక ఇప్పుడే కొత్తగా పెళ్లి అయిందండి . మా ఇంట్లో నా అత్తా మామలు ఉంటారండి . నాకేమో గ్యాస్ ట్రబుల్ వుండండి . దానివల్ల పిత్త వలసిన అవసరము వున్నపుడు , పెద్దగా శబ్దము వస్తుందేమో అనే భయం చేతను ,అలాంటి శబ్దము చేసే అల్లుడిని చూసి అత్తమామలు ఏమనుకుంటారు ?అనే బెరుకు చేతనూ , ఒక వేళా పెళ్లి కాన్సుల్ అంటారెమో అనే భయం చేతను - నాకేదో దుష్ట దుర్మార్గపు శక్తులు పర్మిషన్ ఇవ్వనట్లు బిగ పట్టుకొని కూచుంటాను .ఇక్కడి కొచ్చి నాకు అన్ని రకాల పెర్మిషన్లు దొరికినట్లు ఫీల్ అవుతూ నా గ్యాస్ వదిలేస్తాను . ఇందుకోసము అని పార్కుకు వస్తాను కానీండి మరొకందుకు కాదు . వీధి కుక్కల మీది ప్రేమతో దానికి స్వయం ఉపాధి నేర్పానే తప్ప నా వినోదం కోసం కాదు . మీరు అపార్థం చేసుకో వద్దు . రేపుకలుద్దాం" అని అయన అన్నాడు .
" వారినీ ఎంతటి వాడివిరా బాబూ ? నీ బాంబు ప్రయోగాలతో ప్రకృతిని కలుషితం చేస్తూ వున్నావా ? ఇక్కడేదో ప్యూర్ ఆక్సిజె దొరుకుతుంది అని వచ్చే మాలాంటి వాళ్లకు ఎంత అపచారం చేస్తున్నావురా ? నేను చూస్తూ ఊరుకోను .నీ అపచారానికి తగిన ప్రతీకారం తీర్చుకుంటాను . ఇదే కుక్కకు అది కూడా నేర్పి దాని స్వయం ఉపాధిని మరింత బలోపేతము చేస్తాను - ఈ అమరావతి వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అంటే ఏమనుకున్నావో ఏమో ? అని మనసులోనే ఛాలెంజ్ చెప్పి " ఓకే సర్ - అలాగే మళ్ళీ కలుద్దాం " అని నేను ఆయనతో షేక్ హ్యాండ్ చేసాను .

**4.**చెట్టు చుట్టూ కథ **03-01-25**



సౌత్ కొరియా అమెరికా వారి చేతుల్లో వుంది . ఇక్కడ అమెరికా సైన్యము ఉంటుంది . నార్త్ కొరియా రష్యా వారి చేతుల్లో ఉంటుంది .ఇక్కడ రష్యా వారి సైన్యము ఉండదు . రష్యావారు నార్త్ కొరియా కి మద్దత్ గా నిలుస్తారు అంతే . అంటే రష్యా మరియూ అమెరికా సైన్యము ఒకరికి ఒకరు ఎదురు పడటం అనేది ఉండదు. ఇక ఈ కొరియా గురించి ఏదన్నా చర్చించు కోవాల్సి వస్తే అందుకు అనుగుణంగా ఉండేట్లు - రష్యా మరియూ అమెరికా దేశాలు కొరియా మధ్యలో 800 మీటర్ల వృత్తకారపు ఏరియాని ఏర్పరుచుకున్నాయి . దీనిని జాయింట్ సెక్యూరిటీ ఏరియా {JSA } అంటారు . ఈ ఏరియాలో ఉన్న బిల్డింగ్ లలో సౌత్ కొరియా మిలిటరీ వారు నార్త్ కొరియా మిలిటరీ వారు ఒకరి కొకరు తుపాకులు ఎక్కు పెట్టుకొని ఒకరికొకరు కొన్ని అడుగుల దూరంలో నిలబడి వుంటారు . ఈ {JSA }.ఉమ్మడి జాగాలో లో ఎవరి హద్దు ఎక్కడి వరుకు అనేది నిర్ణయం అయి లేదు . ఇలాంటి ఉమ్మడి జాగాలో రావి చెట్టు వంటిది మొలిచి పెరిగింది .ఈ చెట్టు ఏ రోజు కా రోజు ఏపుగా పెరిగే స్వభావం వున్న చెట్టు . సౌత్ కొరియాకు చెందిన నెలలో పుట్టి పెరుగుతున్నదా? లేక లేక నార్త్ కొరియాకి చెందిన నేలలో పుట్టి పెరుగుతున్నదా ? అనేది నిర్ణయించటానికి వీలు లేని చోట ఈ చెట్టు పుట్టి పెరుగుతూ వున్నది.

నేల ఎవరిదీ అని నిర్ణయించటానికి వీలులేని ప్రాంతాన్ని standoff పాయింట్ అని - అక్కడి చెట్టును "స్టాండాఫ్ ట్రీ " అని అంటారు . ఆగష్టు 1976 నిజంగా ఇలా జరిగింది . సౌత్ కొరియా లో ఉంటూ నిరంతరమూ నార్త్ కొరియా లోకి తొంగి చూసే సైనిక దళము ఒకటి - తమ బైనార్క్యులర్స్ యొక్క దృష్టికి ఈ రావి చెట్టు అడ్డుగా వస్తూ వున్నదని ఫిర్యాదు చేసింది . దీనికి స్పందించిన అమెరికా - - "ఆపరేషన్ లంబార్జాక్ " అనే పేరుఈ చెట్టు నరికే పని చేపట్టింది .
August 18, 1976 న - రెండున్నర టన్నుల బరువు వుండే ఓ భారీ లారీ మీదకు ఎక్కిన అమెరికా వారు చెట్టును నరకటానికి వచ్చారు .లారీలో ఓ ఐదు మంది పనివారూ - వారికి రక్షణగా పది మంది సైనికులు -వచ్చారు . ఈ రక్షణ దళానికి నాయకులు " Lieutenant Mark Barrett మరియూ "Captain Arthur Bonifas "
చెట్టును నరుకుతూ ఉండగా నార్త్ కొరియా సైనికులు మొదట మౌనంగా చూస్తూ ఊరుకున్నారు .

కానీ అమెరికా సైనికుల యొక్క హంగామా చూసి ఇదేదో కవ్వింపు చర్య అని భావించిన ఓ నార్త్ కొరియా అధికారి తనకోసం మరికొంత సైన్యాన్ని రప్పించుకున్నాడు .అప్పుడు మొత్తము 15 మంది వరకూ కల నార్త్ కొరియన్ సోల్జర్స్ చెట్టు వద్దకు వచ్చారు ."వారి మీద దాడి చేసి ఆ చెట్టు నరికివేతను ఆదుకోండి "అని ఆ అధికారి ఆదేశించాడు . దాడిని ఆదేశించిన వాని పేరు "పక్ చుల్ " ("Lt.Pak Chul ఇతనికి ""Lt Bulldog",అనే మారు పేరుకూడా వుంది . అంటే చిన్న అలజడికి కూడా రెచ్చిపోయే స్వభావం వున్నవాడు . నార్త్ కొరియా సైనికులు - చెట్టును నరుకుతూ వున్న వారిని అటకాయించి వారి చేతుల్లో వున్న గొడ్డళ్లు స్వాధీనం చేసుకున్నారు . ఆపై అమెరికా వారి మీద పడి అవేగొడ్డళ్ళతో . ఇద్దరు అమెరికా సైనికాధికారులను చంపి వేసి - నలుగురు అమెరికా సైనికులను నలుగురు సౌత్ కొరియా సైనికులను గాయపరిచారు . జరిగిన దానికి నార్త్ కొరియా సౌత్ కొరియాకి క్షమాపణ చెప్పింది.
చెట్టు కు అత్యంత తొందరగా పెరిగే స్వభావము ఉన్నది . మళ్ళా పెరుగుతుంది- మళ్ళా ఓ తగాదా వస్తుంది అనే ఆలోచనతో -- August 21, 1976 న అమెరికా మరొకసారి ఈ చెట్టు జోలికి పోయింది . చెట్టును మొదలంటా నరికి వేయటంద్వారా సమస్యకు ఓ పరిష్కారం కనుగొనాలనే కాక , నార్త్ కొరియాకి తమ శక్తి

చూపించాలని కూడా అమెరికా అనుకుంది . ఈ సారి ఈ చెట్టు నరికి వేతకు రొండు రోజులముందునుండీ ప్లాన్ చేశారు . US Army తరఫునజనరల్ రిచర్డ్ G. స్టిల్వెల్ అనే అయన పధకాన్ని రూపొందించగా , కెప్టెన్ ఆర్థర్ బోనిఫేస్ అనే అయన ఈ పధకాన్ని అమలు జరుపుతాడు . చెట్టు నరుకుతున్న పుడు నార్త్ కొరియా సైనికులు కనుక మళ్ళా జోక్యం చేసుకుంటే వారి పని పట్టటానికి వీలుగా 27 హెలికాప్టర్స్ --బాంబర్లు -మిలిటరీ గ్రౌండ్ వెహికల్స్ -ఆఫ్ -షోర్ ఎయిర్క్రాఫ్ట్ కారియర్ -- 64 మంది సౌత్ కొరియన్ సైనికులు విత్ గన్స్ మరియూ మరో 60 మంది విత్ పిస్టల్స్ -తో సిద్ధంగా ఉండేట్లు చూసుకున్నారు .

ఎనిమిదిది మంది మనుషులు చైన్ సా ని పట్టుకొని వెళ్లి చెట్టు పని పట్టారు . "నీదో నాదో తేలని చెట్టును తుదముట్టించ గలిగిన దమ్ము నాకే వున్నది - నీకు లేదు " అని రష్యాతో చెప్పటానికే అమెరికా ఈ చెట్టు నరుకుడుకి నడుం కట్టింది అని విశ్లేషించబడింది . మొత్తము మీదా 300 సైనిక ట్రూపులు వెన్ను దన్నుగా నిలవగా అమెరికా ఈ చెట్టును 40 నిమిషాలలో పడకొట్టింది . ఈ సారి నార్త్ కోరీయా ఏమి మాట్లాడక మౌనం వహించింది . అమెరికా వారు చెట్టును పడగొట్టి ఆ మొద్దును స్వాధీన పరుచుకొని - తీసుకు వెళ్లి - ఇంతకు ముందు ఈ చెట్టు వద్ద ప్రాణాలు కోల్పోయిన ఇద్దరు అమెరికన్ మిలటరీ అధికారుల సమాధి వద్ద పడవేశారు . అమెరికన్ సైనికుల మీదకు నార్త్ కొరియా సైనికుల దాడిని ఆదేశించిన "పక్ చుల్ ఆ తరువాత రోజుల్లో ఇదే సరిహద్దులవద్ద ఇరుదేశాల మధ్య జరిగిన కాల్పులలో మరణించాడు అని చెప్పారు . ఆలా అని రికార్డులు మాత్రం లేవు . కానీ అటుతరువాత ఇతనూ ఎవరికీ కనపడకుండా పోయాడు . "పక్ చుల్ " బ్రతికే ఉంటే కనుక అతనిని వెతికి వేటాడి పట్టుకోవాల్సిన పని అమెరికా సి ఐ ఏ కి తగిలి ఉండేది .

. ఏది ఏమైనా చెట్టు కేంద్రంగా మరో ప్రపంచ యుద్ధము జారకుండా ఆగిపోయిందని ప్రపంచములో ని అందరూ ఊపిరి పీల్చుకున్నారు .

రచన సేకరణ వివరణ వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

**3.** సత్తి పండు గారి పత్తి పండు ఆలోచన **31 -12 -24**

సత్తి పండు అంటే మీ పొరుగు ఇంటాయన. పత్తి పండు అంటే మీకు దారాన్ని ఇచ్చే పత్తి కాయ .
పత్తి పండు నుండి వచ్చే దారము ఒక మీటారా? ఫది మీటర్లా ? వంద మీటర్లా అనేది దానిలోనుండి దారాన్ని పిండే మీ శక్తి ని పట్టీ ఉంటుంది . సత్తి పండును కదలిస్తే మీటర్ల పొడుగూ సాగే అభిప్రాయాలూ చెపుతాడు .అతని నుండి అభిప్రాయాలను రాబట్టటం మీ శక్తిని బట్టీ ఉంటుంది .
" ఏమండీ మీరు కూడా మీ అబ్బాయిని సాఫ్ట్ వేరు ఇంజనీరును చేయాలనే గురి పెట్టేరు ? అందరూ సాఫ్ట్ వేర్ ఇంజనీర్లు అయితే ప్రపంచ్చం నడిచేది ఎట్లా అని అడిగాను .

" ఓ కోషెన్ రూపంలో నా అభిప్రాయం అడిగారు కాబట్టి చెబుతా వినండి . పూర్వము వున్న రాజుల కోసం - బట్టలు నేసేవారు - నాట్యం చేసేవారు -- కవితలు కావ్యాలు రాసేవారు .కత్తులు నూరే వారు , ఇట్లా అన్ని వృత్తుల వారువుండే వారు . వారు రాజు కన్నులలో పడితే చాలు అనుకుంటూ వుండే వారు .ఇప్పుడు సాఫ్ట్ వెర్ ఇంజనీరు కోసం - బట్టలు రూపొందించేవారు - ఇల్లు కట్టే వారు - బుక్స్ రాసేవారు - సినిమాలు తీసే వారు - బీరియానీలు వండేవారు - ఊరగాయలు పెట్టేవారు - సిద్ధంతులు - హోమ కర్తలు , అనేకులు పుట్టుకు వచ్చి - మేము సాఫ్ట్ వెర్ ఇంజనీర్ కంట్లో పడితే చాలు , మమ్ము వారు మెచ్చితే చాలు ,మేము వారిని ఆకర్షించ గలిగితే చాలు అనుకుంటూ వున్నారు . సాఫ్ట్ వెర్ ఇంజనీరు అంటే రాజు ల పై రాజు లాంటి వాడు. మరి మా అబ్బాయి మహారాజు మోడల్ పదవి అందుకుంటాడనే ఆశతో నేను ఉండటం ఏదన్న తప్పా ? తప్పా ? అని సత్తి పండు నొక్కి వక్కాణించాడు .

పూర్వపు కాలములో రాజుగారి మీద ఆధారపడిన రంగాలు ఎన్ని ? ఇప్పుడు సాఫ్ట్ వేర్ మీద ఆధారపడిన రంగాలు ఎన్ని అనే విషయము మీద మేమిద్దరమూ కూచుండి ఓ లిస్టు రూపొందించాం . పత్తి పండులోనుండి దారము వచ్చినట్లు మీటర్ల కొద్దీ పేర్ల లిస్టు పేపరు మీదకు ఎక్కుతూ వున్నది . పంచాంగము , పూజలు కూడా సాఫ్ట్ వేర్ ని దృష్టిలో పెట్టుకొని తయారు అవుతున్నవి అని ఇది

రాజుల కాలం లో లేదని మాకు మొదటిలోనే తెలిసి - అదే సంగతి మొదటిగా రాసాము . మా లిస్టుకు మీ జిందాబాద్ లేనా ? రేపటి 01 -01 -25 కూడా సాఫ్ట్ వేర్ వారి కోసమే డిజైన్ చేస్తారు . వారు ఈ ఈవెంటుకు దూరంగా ఉంటే - పబ్బుల దాకా వచ్చిన ఈ న్యూ ఇయర్ అక్కడనే ఆగి పోయి తన వెలుగులను కోల్పోవచ్చు .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి యొక్క సొంత కథ .

**2.**సంఘటన **30 -12 -24**

లేదా ఇట్ ఐస్ నో హార్ట్ బ్రేకింగ్ అనే మూలుగు**.**

నిన్నటి ఆదివారము అనగా 29 -12 -24 మీరు నావెంట పడి ఒక ఈవెనింగ్ వాక్ కి వచ్చి ఉంటే నేను చూసింది మీరూ చూసి ఉండేవారు . పెద్దపెద్ద పట్టణాలలో ఆది వారము అంటే చిన్న చిన్న ఉద్యోగాల వాళ్ళు ముసుగులు తన్ని ఇంట్లో పడుకునే రోజు . పెద్ద పెద్దవాళ్లు కార్లు ఎక్కి తిరిగే రోజు .ఎవడో నాలాంటి వాడు ఒక్కడే రోడ్లమీద నడుస్తూ ఉంటాడు కాలక్షేపం కోసం లేదా ఆరోగ్యం కోసం అని . నేను ఆరోగ్యం కోసమై నడుస్తూ ఉంటే ఒక దృశ్యం కనపడింది . టాటా మ్యాజిక్ లాంటి వాహనానికి ఓ రంగు రంగుల చీరని కట్టి అదే బ్యాక్ గ్రౌండ్ సీన్ గా ఓ జంట నాట్యము లేదా రికార్డింగ్ డాన్స్ లాంటిది చేస్తూ వున్నది .ఆ జంటలోని అబ్బాయి 25 ఏళ్ల వాడు కావచ్చును కాళ్ళూ చేతులూ విరుచుకుంటూ డాన్స్ చేసి జనాన్ని ఆకర్షించాలని చూస్తున్నాడు. ఆ పిల్ల అతని భార్య ఓ ఇరవై ఏండ్ల చిన్నది. అసభ్యత అస్లీలము వంటిది ఏమీ లేకుండా చిరునవ్వు మరియూ నగుమోము ఏ ఆభరణంగా జనాలను ఆకర్షించాలని చూస్తూ వున్నది . కానీ నన్ను ఆకర్షించింది మాత్రము మూడు ఏండ్ల వయసు కు లోపల వున్నా ఆమె కొడుకు . ఆ చిన్నవాడు తన తల్లి తన తండ్రి చేతులు పట్టుకొని గిర్రున తిరిగి ఓ చిందు వేయగానే గుక్క పట్టి ఏడుస్తూ వున్నాడు . "అమ్మా నువ్వు అట్లా చేయవద్దు నాకు నచ్చలే "అని చెప్పటానికే అట్లా ఏడుస్తున్నాడు అని మనిషన్న వాడికెవడికైనా అర్థం అవుతుంది . కానీ ఆమె డాన్స్ ఆపకుండా మోహన చిరునవ్వు

చెరిగిపోకుండా చూసుకుంటూ - బిడ్డ ఏడుపు మాన్చటానికై అతని వంక చూస్తూ " ఏడుపు మాను - దెగ్గరికి రా మా తో కలవు" అన్నట్లు చేయి చాస్తూ వున్నది . ఆ చిన్న వాడు తల్లి వద్దకు రావటమే లేదు . తల్లి చేస్తున్న డాన్స్ ఎదో అది మానితే కానీ రాను  అన్నట్లు ఏడ్పు పెంచుతూ వున్నాడు . ఇలాంటి కొడుకు వున్నందుకు భారత మాత గర్విస్తుంది కదా అనుకున్నాను . నేను ఒక ఇరవై--  వారు రోడ్డుపై పెట్టిన బాక్స్ లో వేసాను . అప్పటికి అందులో ఇంకో పది తప్ప వేరే ఏమీ లేదు .నేను పై న చెప్పిన ఆదివారం ఎఫెక్ట్ వలన ఆ డాన్స్ చూస్తున్న వారూ లేరు - డబ్బు ఇస్తున్న వారూ లేరు .

నేను ఇంటి దారి పడుతూ ఉండగా - ఆ తల్లి నాట్యమూ - ఆపిల్ల వాడి ఏడుపు ను పక్క పక్కన పెట్టుకొని విశ్లేషించిన నా బుర్ర లో వున్నా ఫీలింగ్స్ అనే వాడు " ఇట్ ఈజ్   సో హార్ట్ బ్రేకింగ్ " అన్నాడు  . ఒక సారి అని ఊరుకోకుండా పది సార్లు అన్నాడు  . అప్పుడు పీవీ గారు చెప్పిన నాలోని ఇన్సైడర్ నిద్రలేచి - "బాగానే వుంది ? మరి ఆ ఏడ్చే పిల్ల వాడికోసం ఏమి చేసావు?"  అని నిల తీసింది .

" ఏమిచేయాలి ?నేను ఆ ఇరవై బదులు  ఓ ఐదు ఖర్చు పెట్టి ఓ లేక్స్ పాకెట్ పిల్లాడికి కొనిచ్చి వాడి ఏడ్పు మాన్పించి ఉండవచ్చు . కానీ తల్లి పట్ల నిజమైన దుఃఖము పొందుతున్న పిల్లవాడి ని ఏడ్పు మాన్పించటం ధర్మానికి హాని చేయటం అవుతుంది  . కొడుకును చూసుకొని ఆ తల్లి ఎంత పులకించి పోయిందో ? ఆ పులకింతను నేను రద్దు చేయనా ?" అని నా ఇన్సైడర్ ని ప్రశ్నించాను .

మాడు మీద దెబ్బ పడ్డవాడిలా నా ఇన్సైడర్ నోరు మూసుకున్నాడు . అప్పుడు నా ఫీలింగ్స్ గాడు  మళ్ళీ చెలరేగి " ఇట్ ఈజ్ { ఆపిల్ల వాడి ఏడుపు }   సో హార్ట్ బ్రేకింగ్ " అన్నది . ఇప్పుడు కూడా నా ఇన్సైడర్ నిద్రలేచి జూలు విదిల్చి " నువ్వు ఆ జంటని . ఆ పిల్లవాడిని ఉద్దేశించి వారికి ఏ కూల్ డ్రింకు నో  ఓ వాటర్ బాటిల్ నో ఇప్పించక పోయావా ? నువ్వు ఆలా ఇచ్చి ఉంటే ఆ ఎగిరే జంటకు అలుపు తీరేది . ఊపిరి ఆడేది . అలాంటి నీ పని వారి కో సత్కారం . వారి జీవితంలో కురిసిన పెద్ద వెన్నెల వాన లా అయ్యేది నువ్వు అలాచేయలేదేమి ? అని అడిగింది .

" నేను , వారిని దాటి ఇప్పటికే పావు మైలు వచ్చాను . ఇంకా వెనక్కి పోయి ముందుకు రాలేను . కానీ నువ్వన్న పని నేను రేపు చేస్తాను . వారు ఇక్కడే ఇదే విధంగా అగుపడితే " అన్నాను

" శెభాష్ అని నాలోని ఇన్సైడర్ అన్నాడు.  ఆ వెంటనే నాలో వుండి  ఆలోచన చేసే వాడు { అంటే బుద్ధి }  నిద్రలేచి " నువ్వు వాటర్ బాటిలో కూల్ డ్రింకు బాటిలో ఇస్తే వారు తీసుకో క పోవచ్చు . తీసుకున్నాక  "  దీని బదులు మాకో వంద నో యాభైనో చేతిలో పెడితే ఇంత అన్నం తినే వాళ్ళము కదా ? అంటారేమో మనకెందుకు  ఆ ప్రసక్తి అన్నది .

అప్పుడు నా ఇన్సైడర్ కలుగ చేసుకొని " వాటర్ బాటిల్తో పాటు ఓ వంద రూపాయలు ఇచ్చి వాళ్ళను ఆనందింప చేస్తే నీకేమీ ఫర్వా లేదా? అన్నది .

నేను ఇన్సైడర్ మాటకి విలువిచ్చాను . ఎందుకంటే నా ఇన్సైడర్ " అది వారి జీవితంలో కురిసిన పెద్ద వెన్నెల వాన లా అయ్యేది కదా " అన్న మాట వాడింది కదా అందుకని . వీలున్న చోటల్లా వెన్నెల వాన కురిపించమే మేఘంలాగా సాగి పోయే  మనిషి జీవన గమ్యం .

.

యదార్ధ ఘటనకు వివరణ తో రాసిన వాడు వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి .



**1.శని బొంగరాలు    28 -12 -24**

మా వైపు వుండే కొంత మంది పునుగులను - పులిబొంగరాలు అని కూడా అంటారు . వాటిని అల్లం చెట్నీ లో నంజుకుని తింటూ ఉంటే ఆ రుచియే అద్భుతః - అను కుంటూ - అవితింటూ కూచొని వున్నాను . ఇందులో వాటా కోసమా అన్నట్లు .వరుణ సిద్ధాంతి  అన్న పేరుతో అనేక యూ ట్యూబ్ ఛానెల్స్ లోనూ, టీవీ లలోను మూఢనమ్మకాలను - కళాపీ ని వెదజల్లినట్లు వెదజల్లే  మా ఆరుణ్ వచ్చాడు .

మేమిద్దరమూ కలిసి పులిబొంగరాలను పంచుకుని తిన్నామో లేదో కానీ ఇట్లా ప్రసంగించుకున్నాము .
అతడు " నేను వెదజల్లుతూ వున్నా మూఢ నమ్మకాలను మించిన మూఢ నమ్మకాలను ఇంకా మరి కొందరు వెదజల్లుతూ వున్నారు . ఈ పోటీలో నేను వారిని మించి ముందుకు దూసుకు పోలేకుండా వున్నాను .నా ఆదాయానికి గండి పడుతూ వున్నది . ఏదైనా ఒక చక్కని మూఢ నమ్మకము ఒకటి చెప్పు ప్రచారం చేసుకుని ఒడ్డున పడతాను " అని సూటిగా అడిగాడు .

అతని సూటి తనానికి నేను ఆనందించి " ఒరేయ్ ..అరుణ్... శని బొంగారాలు అనేవి ప్రచారం చేయి . నువ్వు జగత్ విఖ్యాతి పొంది కోరినంత సంపాదిన చేసే వీలు ఉండొచ్చు " అన్నాను.
" నీ ముందు పులిబొంగరాలు వున్నాయనేనా అట్లా అంటం ? " అని అతడు మొహం ప్రేలాడ వేసాడు .
" అట్లాగే అనుకో-- కాదు అని కూడా అనుకో -- కానీ -- పిల్లలు ఆడుకునే బొంగరాన్ని తీసుకో . దానికి నల్ల రంగు పూసుకో . ఆ నల్లరంగు మీద ఏమిటో గుర్తు పట్టటానికి వీలు లేని గీతలు గీసుకొని - అందులో " ఓం కలీం కలీం భం భం శంభో శని భ్రమణ .. సంహారయామి " అని కూడా రాయి . ఈ బొంగరానికి ఓ కాషాయపు రంగు దారాన్ని కలిపి ఒక అందాల అట్ట పెట్టెలో పెట్టు . దాని మీద " మహా నవ నైమిశారణ్య వన ముని - నవదుర్గోపాసకులు శ్రీ శ్రీ శ్రీ రామకృష్ణ గారి దివ్యాశీసులతో , నూలు వడికి తయారు చేసిన పవిత్ర గురుదారము-- ఇందుతో ఫ్రీగా ఇవ్వబడుతూ వున్నది . బంగరము ను తిప్పుటలో ఈ దారపు యొక్క శక్తిని స్వయంగా అనుభూతి చెందండి .ఈ దారాన్ని మీరు మెడకు, తలకూ, మొలకూ కూడా ధరించి దీని అద్భుతాన్ని - ఆశీర్వచనాన్ని పొందవచ్చు " అని ప్రింటు ఏయించి దానికింద ఓ ఆశ్రమ పు బొమ్మా , ఓ హోమ కుండము ,ఒక నెమలి ఒక పాము , ఓ పులి ఓ లేడి బొమ్మ వేయించు . ఇహ దానిని 999 కి ఒక్కటి లెక్కన నీ టీవీల ద్వారా ఇచ్చి కష్టాలలో వున్నా వారిని ఆశీర్వదించు " అన్నాను .
" 999 తీసుకొని - బొంగరం ఇచ్చి ఆశీర్వదించు అన్నంత వరకూ బాగానే వున్నది . ఏమని చెప్పి బొంగరాలను అమ్మాలి " అని అరుణ్ అడిగాడు .

అప్పుడు నేను " నువ్వు ఇప్పటి నుంచీ  నీ బొంగరాలని ఒత్తి బొంగరాలు అనవద్దు .గురు గ్రాహం కోపిస్తుంది .  శని బొంగరాలు అను . మా ఆశ్రమం లో మంత్రించి ఇచ్చిన బొంగరాలను గిర్రున తిప్పితే - అది తిరిగినట్లే శని దేమునికి తల తిరిగి మీ జోలికి రాకుండా అనంత విశ్వములో ఎక్కడికో పారి పోతాడు . అప్పుడు మీకు శని దేముని నుండి విముక్తి దొరుకుతుంది . అప్పుడు లక్ష్మీ దేవి మీ ఇంటికొచ్చి తాండవమాడుతుంది " అని చెప్పు   అన్నాను

మా అరుణ్ నేను చెప్పమన్నదే కాకుండా ఇంకా ఎదో మసాలా దట్టించి "కోటి"  శని బొంగరాలు అమ్మాడని నాకు వార్తలు అందాయి . అరుణ్ తాను నాకు మాటఇచ్చినట్లు , నా పేరును నా సలహాను వాడుకున్నందుకు గాను,  శని బొంగరం ఒక్కంటికి తొమ్మిది రూపాయల చొప్పున ఇచ్చినట్లాయనా నాకు ఎనిమిది కోట్లు ముట్టవచ్చును . ఎందుకంటే నేను లెక్కలలో వీకు కదా అందుకు . సరే చేసిన పాపం చెవితే పోతుంది అన్నారు . అతడు ఎన్నో సార్లు మా ఇంటికి వచ్చాడు . కానీ డబ్బు సంగతి మాత్రం  ఎత్తలేదు . మొహమాటం చేత నేనో అడగలేదు . "అయితే మొహమాటం రూపంలో ఆ శని  దేముడు   మీమధ్యకు ఎమన్నా వస్తున్నాడంటారా ?" అని నాగృహిణి ఉమా దేవి అడిగిన మీదట - నేను కూడా ఓ శని బొంగరం కొని తిప్పాను . శని తల తిరిగి మా మధ్యనుండి తప్పుకోవాలని .

మీకో  శని బొంగరం లాంటి ఆలోచన కావాలంటే అడగండి  -వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి దాన్ని తన సొంత కధ లో   చెపుతాడు .